శ్రీః

# శ్రీ మహిషాసురమర్దినీస్తోత్రమ్

( రామకృష్ణకవివిరచితమ్)

ప్రతిపదార్థము - భావము - వివరము

**'శంకర కింకరుడు'**



ప్రకాశకులు

## శ్రీ లలితానందాశ్రమము

వాడరేవు


© 1. R.Krishna Kumari
H.No. 4-103. I.L.T.D. Colony (Extn.)
Kothapeta, CHIRALA - 523 157
☎ : 08594 - 202411, 9440115411

2. Sadhana Grandha Mandali
Tenali - 522 201



First Edition : 9-4-1995
యువనామ సం॥ శ్రీరామనవమి

Second Edition : 10-10-1999
ప్రమాథి సం॥ ఆశ్వయుజమాసము - విజయదశమి

Third Edition : 02-11-2013
విజయనామ సం॥ ఆశ్వయుజమాసము - దీపావళి

డా॥ యస్.సూర్యనారాయణ, కోటేశ్వరమ్మగార్ల ఆర్థికసహాయంతో ముద్రించబడిన ఈ గ్రంథము వారి గురుపరంపరలోని మహనీయుల పాదపద్మములకు నమస్సులతో సమర్పితము.
ఈ గ్రంథము 'శ్రీలలితానందాశ్రమము, వాడరేవు' తరపున వెలువరించుటకు అంగీకరించిన 'శ్రీశ్రీశ్రీ అరుళానంద స్వామి' వారికి నమస్కరిస్తూ.....

- రామోరా





***Printed at* - Karshak Art Printers.**

# పీఠిక

పురారి తనుహారిణీ–దురితసంఘ సంహారిణీ
భజస్మతి వివర్ధినీ ప్రబల దానవోన్మర్దినీ
తుషార గిరినందినీ – ముని హృదన్తరాలమ్బినీ
కుమార ముఖచుంబినీ – హర నితమ్బినీ పాతు వః

– సుభాషితరత్న భాండాగారము.

(పరమశివుని అర్ధదేహమును హరించినది – పాప పుంజములను బరిహరించునది – సేవించువారల బుద్ధిని వృద్ధి చెందించునది – ప్రచండ దైత్యగుణమును మర్దించునది – హిమవత్పుత్రియై జనించినది – మునిమానసముల విరాజిల్లునది – స్కందుని ముఖమును చుంబించునది – హరునకు ఇల్లాలైనది – మిమ్ము గాచుగాక!)

సకల జగన్మూలమైన పరమేశ్వరి. ఆమె పరబ్రహ్మమునకు ఇంచుకయును వేరైనదికాదు. ఆమె మహామాయ! బ్రహ్మవిష్ణురుద్రులు ఆ యమ్మ సృష్టియే! మరి శివుడో? ఈ మూర్తిత్రయమునకును అతీతమైన తురీయవస్తువే (పరబ్రహ్మమే) శివుడు! ఈ మహామాయ పరబ్రహ్మాభిన్న కదా! అందుచే శివుడామె మగడుగా – ఈ మూలప్రకృతియైన మహామాయ ఆయన భార్యగా కీర్తింపబడినారు. ఈ మహామాయ స్వాధీన పతిక! స్వాధీన వల్లభ! తన మగని–తన 'కొంగున ముడివేసికొని' చరించుచున్నది. ఆమెకు లోబడిన వాడగుటచే శివుడే రుద్రునియందేకీభవించి లయకార్యమును నిర్వహించుచుండును. శివుడు రుద్రునితోడనే ఏల ఏకీభవింపవలెను? బ్రహ్మతో –విష్ణువుతో ఏకీభవింపరాదా? అనవచ్చును. అది కుదరదు.

పరబ్రహ్మమే కదా శివుడు! సర్వజగద్విలయ స్థానమైనది పరబ్రహ్మము. "నేతి–నేతి" వాక్యములతో "ఇదికాదు–ఇదికాదు" అనుచు అన్నిటిని నెట్టివేయగా – ఏది నెట్టివేయుటకు వీలు కానిదిగా నిలచియుండునో – అది పరబ్రహ్మము'' ఇటులున్నందున లయమునకు అవ్వల వెలయుచున్న శివుడు 'ఎంత భార్యావిధేయుడైనను' లయ కార్యమును దాటి దిగువకు రాడు. అందుచే శివునకు రుద్రునితో మాత్రమే ఏకత్వము!

బ్రహ్మ పత్ని సరస్వతి. విష్ణు పత్ని లక్ష్మి. వీరు మూల ప్రకృతి యొక్క అంశలు. పార్వతియో! ఆమె సాక్షాత్తు మహామాయయే! 'ఆయమ్మ హిమగిరి నందినిగా అవతరించినది – తపించినది – శివుని బెండ్లాడినది' – ఇదంతయు ఆమె విలాసము. శుంభ నిశుంభులను సంహరించిన మహా సరస్వతి, మహిషాసురుని మర్దించిన





మహాలక్ష్మి, మధుకైటవభులను వధించిన మహాకాళి, శివుని యిల్లాలైన భవాని (గిరి నందిని) ఒక్కటన్న ఒక్కటి. వీరిలో భేదములేదు.

అందుచేతనే – మహాలక్ష్మి, దుర్గ, చండి, పయోనిధిరాజకన్య ఇత్యాది శబ్దములన్నియు పార్వతియందు వర్తించునే గాని, విష్ణుపత్నిని – 'చండి, దుర్గ – పార్వతి' ఇత్యాది నామములతో బేర్కొనుట కుదరదు.

మూలప్రకృతి – మహాలక్ష్మి – మహాసరస్వతి.
విష్ణుపత్ని – కేవలము లక్ష్మి, బ్రహ్మపత్ని – కేవల సరస్వతి.

మరియొకమాట :– "సచామర రమా వాణీ సవ్యదక్షిణ సేవితా"– అనియు లలితా సహస్రనామము. ఇటులీ కైంకర్యము వీరికేనా? పార్వతికి లేదా? ఆమె సేవంచినట్లు లేదేమి? అయ్యా! మూల ప్రకృతియే పార్వతి!! ఆమెనే వారు సేవించుచున్నారు.

మూలప్రకృతియైన మహామాయ కరుణించువరకు – సంసారతాపములు తొలగవు. బ్రహ్మజ్ఞాన ముదయింపదు! ఆ కరుణామయి యొక్క సుప్రసన్నతయే అసురపధోహేతువు. మహిషదైత్యుని మడియజేయగల సామర్థ్యము ఆమెకు మాత్రమే కలదు. ఎవడీ మహిషుడు? ఏనాడో చచ్చినాడు కదా! వారు మనలను బాధించినదిలేదు, బాధించుట లేదు "మహిషుని జంపుటచే ఎవ్వరి దుఃఖములు తొలగెనో, ఎవరికి సుఖములు లభించెనో వారు ఆమెను వినుతింతురుగాక! మనమేల ఆమెను స్తుతింపవలెను? – అనునది ఆలోచింపదగిన అంశమేకదా!

ఇంకొకమాట! శుంభ నిశుంభులను. మధుకైటభులను ఆమెయే సంహరించినది కదా! వానికంటె మహిషవధకున్న ప్రత్యేకత ఏమిటి? అన్న సందియము కూడ తలెత్తుట లేదా? అయ్యా! ఇట్లు శంకించుకొనుచు – వివరించుకొనుచు మరల శంకించుకొనుచు బోయినచో ఈ మండలిమాట – గ్రంథశరీరమును మించినదై" కొండను మించిన బండరాయి" యగును.

సంక్షేపముగా – "మధుకైటభులు – మహిషాసురుడు – శుంభ నిశుంభులు ఒకనాటి వారు కారు, నేడును ఉన్నారు, ఆత్మాభిముఖ వృత్తులకు అడ్డు తగులుచున్నారు – వీరు అసురులు; మహామాయావులు, వారి ఉనికిని కనుగొనుట సుసాధ్యము కాదు. మన మనోరాజ్యముపై వారి అధికారమే సాగుచున్నది" – అనియును,

"ఆత్మాభిముఖ ప్రవృత్తులే దేవతలు!
సంసారాభిముఖ ప్రవృత్తులే అసురులు!" అనియు

క్రోధమే మహిషుడు – క్రుద్ధో హన్యాద్గురూ నపి – క్రోధావిష్టుడు చేయని పాపములేదు – అనియు.

“ఎవని మానసమున క్రోధమన్నది మరి తలఎత్తకుండ మాసిపోయినదో – అచట అనగా వాని మానసమున దేవరాజ్యమున కొకసేగి రాదనియు” – మిగిలిన అసురులెవ్వరును మహిషునకు సాటి కారనియు, “వీనిని వధించుట మహామాయకు మాత్రమే సాధ్యమనియు” – అందుచేతనే – ‘జయజయ హే మహిషాసుర మర్దిని’ అనుచు గీర్తించుట – అనియును మనవి చేయుచున్నాను.

“జయ జయ హే మహిషాసుర మర్దిని” అనుచు జగజ్జననిని వినుతించుట అందరకును ఎల్లకాలము అవశ్యకర్తవ్యమై యున్నది.

ఇట్లగుటచే ఈ స్తుతి – ఇతర స్తుతి కదంబము కంటె విశిష్టమైనది. దీని విశిష్టతకు ఇందలి “లయ” వేరొక ప్రధాన కారణము.

ఈ స్తుతి చండీ సప్తశతియొక్క సుందరమైన సంగ్రహ స్వరూపముగా నున్నది. మధుకైటభుల వధ – శుంభ నిశుంభుల వధ – ఇత్యాదికమైన సప్తశతీచరిత్ర త్రయాంశములు కూడా ఇందు కీర్తింపబడినవి.

ఈ స్తుతికి అర్థము సమగ్రముగా జెప్పగల్గుట సుసాధ్యము కాదు. కేవలము శాబ్దికమైన ఒయ్యారమునకు ముగ్ధమై లోకము దీనిని బఠించుచున్నదే కాని – సమగ్రముగా దీని అర్థమెఱింగినవారై పఠించుట యన్నది ఎచ్చటనో! పైగా ఇందు ప్రవేశించిన అపపాఠములకు, సంసిద్ధములైన పాఠాంతరములకు అంతము లేదు, ముద్రిత ప్రతులయందు ఒక్కొక్కటి ఒక్కొక్క విధముగా నున్నది.

మేము ప్రకటించుచున్న ఈ స్తుతియందుగాని – అర్థతాత్పర్యముల యందు గాని దోషములు లేవు. సర్వసృష్టికిని మూలము మహామాయ అయినట్లు – ఈ గ్రంథమిట్లు వెలుగులోకి వచ్చుటకు కారకులు శ్రీ బులుసు సూర్యప్రకాశము, నా సోదరుడు – ‘శంకర కింకరుడు’.

శుద్ధపాఠ–ప్రతిపదార్థ–తాత్పర్య సమన్వితమైన మాయీ ముద్రణము– సర్వమంగలా శ్రీచరణ రాజీవ సేవాపరాయణమైన భక్తకోటికి అమందానంద సంధాయి కాగలదనుచు విన్నవించు చున్నాను!

ఇట్లు

యువనామ సంవత్సరం
శ్రీరామనవమి

**బులుసు సూర్యప్రకాశశాస్త్రి**
సాధన గ్రంథ మండలి, తెనాలి

## శ్రీ మహిషాసురమర్దినీ స్తోత్రము



# శ్రీ మహిషాసురమర్దినీ స్తోత్రము

శ్లో॥ అయి గిరినందిని నందిత మేదిని విశ్వ వినోదిని నంది నుతే
గిరివర వింధ్యశిరోధి నివాసిని విష్ణు విలాసిని జిష్ణు నుతే ।
భగవతి! హే శితికంఠ కుటుంబిని భూరి కుటుంబిని భూరికృతే
జయ జయ హే మహిషాసురమర్దిని రమ్యకపర్దిని శైలసుతే ॥ 1

శ్లో॥ సురవర వర్షిణి దుర్ధర ధర్షిణి దుర్ముఖ మర్షిణి హర్షరతే
త్రిభువన పోషిణి శంకర తోషిణి కిల్బిషమోషిణి ఘోరరతే ।
దను–జని–రోషిణి దుర్మద శోషిణి దుఃఖ వినాశిని సింధుసుతే
జయ జయ హే మహిషాసురమర్దిని రమ్యకపర్దిని శైలసుతే ॥ 2

శ్లో॥ అయి జగదంబ మదంబ కదంబవన ప్రియవాసిని హాసరతే
శిఖరి శిరోమణి తుంగ హిమాలయ శృంగ నిజాలయ మధ్యగతే ।
మధు మధురే! మధు కైతవ భంజని కైటభగంజిని రాసరతే
జయ జయ హే మహిషాసురమర్దిని రమ్యకపర్దిని శైలసుతే ॥ 3

శ్లో॥ అయి శతఖండ విఖండిత రుండ వితుండిత శుండ గజాధిపతే
రిపు గజ గండ విదారణ చండ పరాక్రమ శౌండ – మృగాధిపతే ।
నిజ భుజ దండ నిపాతిత చండ నిపాతిత ముండ భటాధిపతే
జయ జయ హే మహిషాసురమర్దిని రమ్యకపర్దిని శైలసుతే ॥ 4

శ్లో॥ అయి రణ దుర్మద శత్రు వధోచిత దుర్ధర నిర్జరశక్తి భృతే
చతుర విచార ధురీణ మహాశివ దూతకృత ప్రమథాధి పతే ।
దురిత దురీహ దురాశయ దుర్మద దానవ దూత కృతాంతమతే
జయ జయ హే మహిషాసురమర్దిని రమ్యకపర్దిని శైలసుతే ॥ 5

శ్లో॥ అయి శరణాగత వైరివధూ వరవీర వరాభయ దాయికరే
త్రిభువన మస్తక శూల విరోధిశిరోఽధికృతామల శూలకరే ।
దుమి దుమితామరదుందుభినాద ముహుర్ముఖరీకృత శంఖకరే
జయ జయ హే మహిషాసురమర్దిని రమ్యకపర్దిని శైలసుతే ॥ 6



శ్లో॥ అయి నిజ హుంకృతి మాత్ర నిరాకృత ధూమ్రవిలోచన ధూమ్రశిఖే
సమర విశోషిత శోణితబీజ సముద్భవ శోణితబీజ లతే ।
శివ శివ! శుంభ నిశుంభ మహాహవ తర్పిత భూతపిశాచరతే
జయ జయ హే మహిషాసురమర్దిని రమ్యకపర్దిని శైలసుతే ॥ 7

శ్లో॥ దనుజ సుసంగర రక్షణ సంగ పరిస్ఫురదంగ నటత్కటకే
కనక పిశంగ పృషత్క నిషంగ రసద్భటశృంగ హతాఽవటుకే ।
కృత చతురంగబల క్షితిరంగ ఘటద్బహురంగ రట ద్వటుకే
జయ జయ హే మహిషాసురమర్దిని రమ్యకపర్దిని శైలసుతే ॥ 8

శ్లో॥ జయజయ! జప్యజయే! జయశబ్దపర స్తుతి తత్పర విశ్వనుతే
ఝుణఝుణ ఝింఝిం ఝింకృత నూపుర శింజిత మోహిత భూతపతే ।
నటిత నటార్ధ నటీనట నాయక నాటిత నాట్యను గానరతే
జయ జయ హే మహిషాసురమర్దిని రమ్యకపర్దిని శైలసుతే ॥ 9

శ్లో॥ అయి సుమన స్సుమన స్సుమన స్సుమన స్సుమనోహర కాంతియుతే
శ్రితరజ నీరజ నీరజనీ రజనీ రజనీకర వక్త్రవృతే ।
సునయన విభ్రమర భ్రమర భ్రమర భ్రమర భ్రమరాధిపతే
జయ జయ హే మహిషాసురమర్దిని రమ్యకపర్దిని శైలసుతే ॥ 10

శ్లో॥ కర మురళీరవ వీజిత కూజిత లజ్జిత కోకిల మంజుమతే
మిళిత మిళింద మనోహర గుంజిత రంజిత శైల నికుంజగతే ।
మృగగణ భూత మహాశబరీగణ సద్గుణ సంభృత కేళిభృతే
జయ జయ హే మహిషాసురమర్దిని రమ్యకపర్దిని శైలసుతే ॥ 11

శ్లో॥ కమల దళామల కోమల కాంతి కళా కలితాతుల బాలలతే
సకల కళానిచయ క్రమకేళి చలత్కల హంసకులాళికులే ।
అలికుల సంకుల కువలయ మండిత మౌళి మిళద్బకులాళికులే
జయ జయ హే మహిషాసురమర్దిని రమ్యకపర్దిని శైలసుతే ॥ 12

శ్లో॥ కటితట పీతదుకూల విచిత్ర మయూఖ తిరస్కృత చంద్రరుచే
ప్రణత సురాసుర మౌళి మణి స్ఫురదంశు లసన్నఖ చంద్రరుచే ।
జిత కనకాచల మౌళి పదోర్జిత నిర్జర కుంజర కుంభకుచే
జయ జయ హే మహిషాసురమర్దిని రమ్యకపర్దిని శైలసుతే ॥ 13

శ్లో॥ అవిరళ గండ గళన్ మద మేదుర మత్త మతంగజరాజపతే
త్రిభువన భూషణభూత కళానిధి రూప పయోనిధిరాజసుతే ।
అయి! సుదతీజన లాలస మానస మోహన మన్మథరాజసుతే
జయ జయ హే మహిషాసురమర్దిని రమ్యకపర్దిని శైలసుతే ॥ 14

శ్లో॥ సుర లలనా తత "థేయి తథేయి త" తాళనిమిత్తజ లాస్యరతే
హసన విలాస విలాస్యమయి! ప్రణతార్త జనేఽఽతిప్రేమధరే ।
ధిమికిత ధిక్కట ధింధిమిత ధ్వని ధీర మృదంగ నినాద రతే
జయ జయ హే మహిషాసురమర్దిని రమ్యకపర్దిని శైలసుతే ॥ 15

శ్లో॥ మహిత మహాహవ మల్ల మతల్లిక 'మల్లిత తల్లక' మల్లరతే
విరచిత 'వల్లిక పల్లిక మల్లిక ఝిల్లిక ఝిల్లిక' వర్గ భృతే ।
సిత కృత ఫుల్ల సముల్లసితారుణ పల్లవ తల్లజ సల్లలితే
జయ జయ హే మహిషాసురమర్దిని రమ్యకపర్దిని శైలసుతే ॥ 16

శ్లో॥ భజిత సహస్రకరైక సహస్రకరైక సహస్రకరైక నుతే
కృత సురతారక సంగర తారక సాగర తారక సూనునుతే ।
గజముఖ షణ్ముఖ రాజిత పార్శ్వ సుశోభిత మానస కంజపుటే
జయ జయ హే మహిషాసురమర్దిని రమ్యకపర్దిని శైలసుతే ॥ 17

శ్లో॥ పదకమలం కరుణానిలయే వరివస్యతి యోఽను దినం స శివే!
అయి కమలే కమలానిలయే కమలానిలయ స్స కథం న భవేత్ ।
తవ పదమేవ పరంపద మిత్యను శీలయతో మమ కిం న శివే
జయ జయ హే మహిషాసురమర్దిని రమ్యకపర్దిని శైలసుతే ॥ 18



శ్లో॥ కనక లసత్ కలశాబ్ధి జలై రనుసించినుతే గుణరంగభువం
భజతి స కిం న శచీ కుచకుంభతటీ పరిరంభ సుఖమ్ ।
తవ చరణం శరణం కరవాణి నతామరవాణి నివాసి శివే
జయ జయ హే మహిషాసురమర్దిని రమ్యకపర్దిని శైలసుతే ॥ 19

శ్లో॥ తవ వదనేందు మలం విమలేందుకలా సకలం ననుకూలయతే
కిము పురుహూత పురీందు ముఖీ సుముఖీభి రసౌ విముఖీక్రియతే ।
మమ తు మతం శివనామధనే భవతీకృపయా కిముతత్క్రియతే
జయ జయ హే మహిషాసురమర్దిని రమ్యకపర్దిని శైలసుతే ॥ 20

శ్లో॥ అయి మయి దీనదయాళుతయా కృపయైకతయా భవితవ్య ముమే
అయి జగతో జననీ కృపయోఽసి యథాఽసి తథాను గతానురతే ।
యదుచిత మత్ర భవ త్యురరీ కురుతా దురతాప మపాకురుతే
జయ జయ హే మహిషాసురమర్దిని రమ్యకపర్దిని శైలసుతే ॥ 21

శ్లో॥ స్తుతి మితి స్తిమితస్తు సమాధినా
నియమితోయమితోఽనుదినం పఠేత్ ।
పరమయా రమయా సతు సేవ్యతే
పరిజనోఽపి జనోఽపి చ తం భజేత్ ॥ 22

శ్లో॥ రమయతి కిల కర్ణ స్నేష చిత్తం నరాణా-
మపరజపర మస్మాద్ రామకృష్ణః కవీనామ్ ।
అకృత సుకృత గమ్యం రమ్య పద్యైక హర్మ్యం
స్తవన మవనహేతుం ప్రీతయే విశ్వమాతుః ॥ 23

శ్లో॥ ఇందురమ్యో మహ ర్బిందురమ్యో ముహు-
ర్బిందు రమ్యో యతః సానవద్యం స్మృతః ।
శ్రీపతేః సూనునా కారిత స్సోఽధునా
విశ్వమాతుః పదే పద్య పుష్పాంజలిః ॥ 24

# శ్రీ మహిషాసురమర్దినీస్తోత్రము

శ్లో॥ అయి గిరినందిని నందిత మేదిని విశ్వ వినోదిని నంది నుతే
గిరివర వింధ్యశిరోధి నివాసిని విష్ణు విలాసిని జిష్ణు నుతే ।
భగవతి! హే శితికంఠ కుటుంబిని భూరి కుటుంబిని భూరికృతే
జయ జయ హే మహిషాసురమర్దిని రమ్యకపర్దిని శైలసుతే ॥ 1

ప్రతిపదార్థము: అయి గిరినందిని – పర్వతరాజుకు పరమానందమును గల్గించు ఓ తల్లీ! నందిత – ఆనందింపజేయబడిన, మేదిని – భూ మండలముగలదానా, విశ్వవినోదిని – విశ్వమునకు ఆనందము కలిగించుదానా? నందినుతే – నందీశు నిచే నుతింపబడినదానా, గిరివర వింధ్య – వింధ్యపర్వతరాజు యొక్క శిరోధి – కంఠదేశమున, నివాసిని – నివసించుదానా, విష్ణు విలాసిని – అంతను వ్యాపించిన విలాసములు గలదానా, జిష్ణునుతే – ఇంద్రునిచే గీర్తింపబడినదానా, భగవతి – యశస్సంపదలు, వీర్యైశ్వర్యములు, జ్ఞానవైరాగ్యములు నిండుగా గలదానా, హే – ఓ, శితికంఠ, – కంఠేకాలుని, కుటుంబిని – ఇల్లాలా, భూరి కుటుంబిని – పరబ్రహ్మ పట్టమహిషీ, భూరి కృతే – పరబ్రహ్మమును బొందించుదానా, శైలసుతే – ఓ పర్వతరాజపుత్రీ, రమ్య – అందమైన, కపర్దిని – జటాజూటముగలదానా, హే మహిషాసురమర్దిని – మహిషాసురుని జీల్చిచెండిన ఓ జగజ్జననీ! జయ జయ – జయశీలవై ప్రకాశింపుము.

తాత్పర్యము: అందమైన జటాజూటముగల ఓ గిరిరాజ సుతా! ఓ మహిషాసుర మర్దనీ! నీవు గిరినందినివి, విశ్వమును సృజించి – పాలించి – సంహరించి వినోదించు చుందువు. ఓ అమ్మా! నందీశ్వరుడు నిన్ను సదా వినుతించుచుండును. వింధ్య పర్వతరాజు యొక్క వెన్నుపై వసించుచు, విశ్వవ్యాప్తములైన విలాసములతో ఒప్పుచు సురరాజసన్నుతవై ప్రకాశించుచుందువు. నీవు భగవతివి! ఓ కంఠేకాల కుటుంబినీ! పరబ్రహ్మ పట్టమహిషీ! మాకు బ్రహ్మజ్ఞానమును బ్రసాదించు తల్లివైన నీకు విజయోஉస్తు.

శ్లో॥ సురవర వర్షిణి దుర్ధర ధర్షిణి దుర్ముఖ మర్షిణి హర్షరతే
త్రిభువన పోషిణి శంకర తోషిణి కిల్బిషమోషిణి ఘోరరతే ।
దను–జని–రోషిణి దుర్మద శోషిణి దుఃఖ వినాశిని సింధుసుతే
జయ జయ హే మహిషాసురమర్దిని రమ్యకపర్దిని శైలసుతే ॥ 2



ప్ర॥ సుర–వర–వర్షిణి – దేవతలకు వరములను వర్షించుదానా, దుర్ధర – దుర్జయులైన దుర్జనులకు, ధర్షిణి – భీతి కలిగించుదానా, దుర్ముఖ – దుర్జనులను, మర్షిణి – సహించుదానా (ఎదురు నిలువ గలదానా,) హర్షరతే – ఆనందమునం దానందించుదానా (పరబ్రహ్మస్వరూపా) త్రిభువన పోషిణి – ముల్లోకములను బోషించుదానా, శంకర తోషిణి – శివునకు ముదము గూర్చుదానా, కిల్బిషమోషిణి – పాపములను హరించుదానా, ఘోరరతే – వెఱపును గలిగించు (దుష్టులకు) పనులయందాసక్తి గలదానా, దను–జని–రోషిణి – దనువుయొక్క సంతతియొక్క (దానవులయందు) రోషము వహించుదానా, దుర్మద శోషిణి – మదమత్తులను శోషింపజేయుదానా, దుఃఖ వినాశిని – దుఃఖములను హరించుదానా, సింధుసుతే – సాగర కన్యకా! శైలసుతే... రమ్యకపర్దిని... జయజయ...

తా॥ సుందరమైన జటాజూటముతో వెలయుచున్న ఓ హిమగిరి కన్యామణీ! మహిష మర్దనీ! నీవు దేవతలకు వరములను వర్షించుదువు. దుర్జయులైన దానవులకు భీతి జనింపజేయు చుందువు. ఎంతటి దుష్టులకైనను ఎదురు నిలువగలదానవు, పరబ్రహ్మస్వరూపవు. ముల్లోకములు పరిపుష్టములుగా నున్నవనగా తల్లీ! దానికి నీవే కారణము. శంకరున కానందమును గూర్చుచు – భక్తుల పాపములను హరించుచు – దురాత్ములను భయభీతుల గావించు కార్యముల యందు వినోదించుచుందువు. దానవులయెడ రోసమూనినదానవై – మదమత్తులను విశేషము శోషింపజేయుచు – మ్రొక్కెడు వారి దుఃఖములను హరించుచు విరాజిల్లు సాగరరాజ కన్యవైన ఓ యమ్మా! నీకు జయమగుగాక!

శ్లో॥ అయి జగదంబ మదంబ కదంబవన ప్రియవాసిని హాసరతే
శిఖరి శిరోమణి తుంగ హిమాలయ శృంగ నిజాలయ మధ్యగతే ।
మధు మధురే! మధు కైతవ భంజని కైటభగంజిని రాసరతే
జయ జయ హే మహిషాసురమర్దిని రమ్యకపర్దిని శైలసుతే ॥ 3

ప్ర॥ అయి జగదంబ – ఓ జగజ్జననీ, మదంబ – ఓ నా తల్లీ! కదంబవన – కడిమి చెట్లతోపు, ప్రియ – ఇష్టమైన, వాసిని – నివాసముగా గలదానా, హాసరతే – సదా ఆనంద మయవై వర్తిల్లుదానా, శిఖరి శిరోమణి – పర్వత శ్రేష్ఠమైన, తుంగ – సమున్నతమైన, హిమాలయ – హిమవన్నగముయొక్క, శృంగ – శిఖర రూపమైన, నిజ + ఆలయ – స్వీయమైన మందిరముయొక్క, మధ్యగతే – నడుమ విరాజిల్లుదానా,

మధు మధురే – మధువు వలె మధురమైన దానా, (మధుశబ్దమును – పర బ్రహ్మము – ఆత్మ అనెడు అర్థములయందును ఉపయోగించుట కలదు. సర్వులయందును ఆత్మరూపమున వెలయుచుండును గనుక ఎల్లరకు మిక్కిలి పాత్రమ వైనదానవని అర్థము) మధు – మధువను మహారాక్షసుని, కైతవ – మోసమును, మాయను, భంజని – భగ్న మొనరించుదానా, కైటభగంజిని – కైటభదానవుని హాహాకారములకు గారణమైనదానా! (గజి – శబ్దే, గంజతి – శబ్దాయతే), రాస – రస స్వరూపమైన పరబ్రహ్మమునందు, రతే – రమించుదానా, శైలసుతే... రమ్యకపర్దిని... జయజయ.

తా॥ కమనీయకపర్దాలంకృతవైన ఓ గిరికన్యామణీ! మహిష మహాసుర సంహారిణీ! ఎల్లలోకములకు జననివైన ఓ నా కన్నతల్లీ! నీవు కదంబ వనవాసవు. ఆనందస్వరూపవు, పర్వత సార్వభౌముని పర మోన్నత శిఖరమున గల మందిరములో విరాజిల్లియుందువు, అమ్మా! నీవు సర్వులయందును స్వాత్మరూపమున వెలసియున్న మధురాకృతివి. మధుదైత్యుని మాయలను మంటగలిపి – కైటభాసురుని గాలరాచి కూయి వెట్టించిన దానవు. జననీ! జయ!జయ!

శ్లో॥ అయి శతఖండ విఖండిత రుండ వితుండిత శుండ గజాధిపతే
రిపు గజ గండ విదారణ చండ పరాక్రమ శౌండ – మృగాధిపతే ।
నిజ భుజ దండ నిపాతిత చండ నిపాతిత ముండ భటాధిపతే
జయ జయ హే మహిషాసురమర్దిని రమ్యకపర్దిని శైలసుతే ॥ 4

ప్ర॥ అయి – ఓ, శతఖండ – నూరు ముక్కలుగా, విఖండిత – నఱుకబడిన, రుండ – మొండెము, వితుండిత – ఖండింప బడిన, శుండ – తుండముగల, గజాధిపతే – గజాసురుడు గలదానా, రిపు గజ – శత్రువుల ఏనుగుల, గండ విదారణ – చెక్కిళ్ళను జీల్చుటయందు, చండ – తీవ్రమైన, పరాక్రమ శౌండ – పరాక్రమ నైపుణ్యమును, మృగాధిపతే – సింహరాజము గలదానా, నిజ – స్వీయములైన, భుజ దండ – బాహుదండములచే, నిపాతిత – నేలగూల్చబడిన, చండ – చండుడు, ముండ – ముండుడు అను, భటాధిపతే – సైన్యాధిపతులు గలదానా, శైలసుతే... రమ్యకపర్దిని... జయజయ.

తా॥ భవ్యజటాకలాప పరిశోభితవైన – ఓ ధరణీధరరాజ కన్యామణీ! మహిషదానవమర్దినీ! నీవు గజాసురుని ఖండించి – వాని మొండెమును శతశతఖండములుగా గొట్టినావు. చండ పరాక్రమముతో శత్రుసేనాగజముల చెక్కిళ్ళను



జీల్చిచెండు మహాసింహముపై నెక్కి విహరించుచుందువు. శుంభ – నిశుంభుల సేనలో ఉద్దండులు వీరని పేరొందిన – "చండ–ముండులను" నేలగూల్చిన – ప్రచండ బాహుదండలములతో పరిఢవిల్లు జననీ! నీకు విజయాభినందనలు!

శ్లో॥ అయి రణ దుర్మద శత్రు వధోచిత దుర్ధర నిర్జరశక్తి భృతే
చతుర విచార ధురీణ మహాశివ దూతకృత ప్రమథాధి పతే ।
దురిత దురీహ దురాశయ దుర్మద దానవ దూత కృతాంతమతే
జయ జయ హే మహిషాసురమర్దిని రమ్యకపర్దిని శైలసుతే ॥ 5

ప్ర॥ అయి – ఓ, రణ దుర్మద – సంగరమత్తులైన, శత్రు – శత్రువులను, వధ + ఉచిత – వధించుటకు తగిన, దుర్ధర – ఎదురుకొనుటకు శక్యముగాని, నిర్జరశక్తి – బ్రహ్మాదిదేవతల శక్తులుగా దలయెత్తిన బ్రాహ్మీ మాహేశ్వరి మున్నగు శక్తులతో, భృతే – నిండినదానా, చతుర విచార ధురీణ – మంచి ఆలోచనా నైపుణ్యముగల, మహాశివ – పరమశివుని, దూతకృత – దూతగా జేసికొన్న, ప్రమథాధి పతే – ప్రమథగణాధీశ్వరీ, దురిత దురీహ – పాపమయములైన పాడు కోరికలతో, దురాశయ – దుర్భావములతో, దుర్మద – అధికముగా మదించిన, దానవ – శుంభ నిశుంభాసురుల, దూత – సందేశమునుమోసి తెచ్చిన రాక్షసుని, కృతాంతమతే – అంతమొందించు బుద్ధితో జెలంగిన తల్లీ! శైలసుతే... రమ్యకపర్దిని... జయజయ.

తా॥ రమ్య కపర్దాలంకృతమైన ఓ గిరిరాజసుతా! మహిష మహాసురుని మర్దించిన తల్లీ! యుద్ధోన్మాదముతో బెల్లురేగిన రక్కసుల మూకలనెల్ల వధింపగల బ్రాహ్మీ, మాహేశ్వరి కౌమారి, నారసింహ, వైష్ణవి మున్నగు శక్తిగణముచే బరివేష్టితవై చెలగినదానవు. రాక్షసాధిపతులైన శుంభ నిశుంభులయొద్దకు చతురమతియైన పరమశివుని దూతగా బంపుటచే "శివదూతి" యను పేరు విఖ్యాతురాలవైన ప్రమథాధీశ్వరీ! పాపేచ్ఛలతో పాపభావములతో మదించిన శుంభ నిశుంభుల దూతయైన "ధూమ్రాక్షుని" – హుంకారము చేతనే భస్మమొనరించిన యో చండికాదేవీ! నీవు సదా జయశాలినివై వర్ధిల్లుము.

శ్లో॥ అయి శరణాగత వైరివధూ వరవీర వరాభయ దాయికరే
త్రిభువన మస్తక శూల విరోధిశిరోఽధి కృతామల శూలకరే ।
దుమి దుమితామర దుందుభినాద ముహుర్ముఖరీకృత శంఖకరే
జయ జయ హే మహిషాసురమర్దిని రమ్యకపర్దిని శైలసుతే ॥ 6

ప్ర॥ అయి – ఓ, శరణాగత –శరణొందిన, వైరివధూ – శత్రువనితల, వర – మగలైన, వీర – వీరులకు, వర + అభయదాయికరే – వరాభయములను ప్రసాదించు చేతులు గలదానా! త్రిభువన – మూడు లోకములను, మస్తక శూల – నడునెత్తిన శూలములై బాధించు, విరోధిశిరః – శత్రువుల శిరసులపై, అధికృత – అధికారిగా చేయబడిన (ఉంచబడిన), అమల శూలకరే – మోయుచున్న శూలము చేతియందు గలదానా, దుమిదుమిత – 'దుం దుం' అని మ్రోగుచున్న, అమర దుందుభినాద – దేవ దుందుభుల మ్రోతలచేత, ముహుః – మాటి మాటికి, ముఖరీకృత – అధికముగా ధ్వనించుచున్న, శంఖకరే – శంఖమును జేత బూనినదానా, శైలసుతే... రమ్యకపర్దిని... జయజయ.

తా॥ ఓ శైలాధిరాజతనయా! నీ శిరమున రమ్యకపర్దము సిరులు గురియుచుండును. మహిషదైత్యుని రూపుమాపిన మహాలక్ష్మీ! జననీ! శత్రువీరుల ఇల్లాండ్రు నిన్ను శరణొందగా వారి వీరులైన పతులను సంగరమున సంహరింపక విడుచుటయే కాదు. వారలకు వరమునొకచేత, అభయమును వేరొకచేత అనుగ్రహించుచుందువు. తల్లీ! ముల్లోకములను శిరశ్శూలములై బాధించు రక్కసుల నుక్కడంచుటకు వారి తలలపైకెత్తబడిన శూలాయుధము నీయొక్క మరియొక చేతిలో మెఱుపులీనుచుండును. అంబా! దేవ దుందుభులు 'దుం–దుం' అని మొరయుచుండగా – మాటి మాటికీ ధ్వనించు శంఖమును, ఇంకొక చేత ధరించి విరాజిల్లుచుందువు. జననీ! జయజయ.

శ్లో॥ అయి నిజ హుంకృతి మాత్ర నిరాకృత ధూమ్రవిలోచన ధూమ్రశిఖే
సమర విశోషిత శోణితబీజ సముద్భవ శోణితబీజ లతే ।
శివ శివ! శుంభ నిశుంభ మహాహవ తర్పిత భూతపిశాచరతే
జయ జయ హే మహిషాసురమర్దిని రమ్యకపర్దిని శైలసుతే ॥ 7

ప్ర॥ అయి – ఓ, నిజ హుంకృతి మాత్ర – తనయొక్క హుంకార మాత్రముచే, నిరాకృత – నిరాకరింపబడిన (చల్లార్పబడిన), ధూమ్రవిలోచన – ధూమ్రాక్షుడనెడు, ధూమ్రశిఖే – పొగతో నిండిన అగ్ని జ్వాలగలదానా! సమర – యుద్ధమున, విశోషిత – అధికముగా శోషింపజేయబడిన, శోణితబీజ సముద్భవ – నెత్తురు విత్తనమునుండి పుట్టిన, శోణితబీజ లతే – రక్తబీజాసురుల తీవ (పరంపర) గలదానా, శుంభ నిశుంభ – శుంభ నిశుంభులతోడి, మహా + ఆహవ – మహా సంగ్రామమున, తర్పిత – తృప్తి చెందింపబడిన, భూతపిశాచ – భూతములయందును, పిశాచముల యందును,



రతే – ఆనందించినదానా, శివశివ – ఆశ్చర్యమాశ్చర్యము, శైలసుతే... రమ్యకపర్దిని... జయజయ.

తా॥ మనోహరమైన కపర్దముతో భాసించు ఓ భూధర రాజకుమారీ! మహిషాసురుని ప్రాణముల పాదులను బెకలించిన తల్లీ! నీవు శుంభ నిశుంభులు పంపగా వచ్చిన ధూమ్రాక్షుడు పొగలెగయుచున్న అగ్నిజ్వాలవలె నీ మీదకు దూకుచు రాగా కేవల హుంకారముతో వానిని గాల్చి బూది చేసినావు. అమ్మా! నీవు – రక్తబీజుడు అనెడు రక్కసుడు తన నెత్తురు బొట్లు ఎన్ని నేలమీద బడునో అందరు రక్తబీజులుగా అవతరించు వరము గలవాడు నిన్ను జుట్టుముట్టగా (నేలమీద బడిన వాని నెత్తురే వాని పుట్టుకకు కారణము అందుచేతనే వాడు "రక్తబీజుడు") వాని నెత్తురు నేలమీద పడుటకు ముందే ఎండిపోవునట్లు చేసినదానవై రక్తబీజాసురుల పరంపరాలతికను సంహరించిన సమర కార్య చతురవు. శుంభ నిశుంభులతో సాగిన ఘోర సంగ్రామమున నీచే జచ్చిన రక్కసుల మూకల మాంసమును నెత్తురును కడుపు నిండుగా తిని త్రావి పరితృప్తి వహించిన భూతపిశాచగణములను జూచుచు ఆనందించితివి తల్లీ! నీచే యుద్ధము అతిలోక విస్మయకరమైనది. అంబా! నీ కనవరతము జయమగుగాక. (ఆశ్చర్యమును, విషాదమును సూచించుయందు "శివ శివ" అన్న శబ్దమును చాలామంది ప్రాచీనకవులు ఉపయోగించినారు.)

శ్లో॥ దనుజ సుసంగర రక్షణ సంగ పరిస్ఫురదంగ నటత్కటకే
కనక పిశంగ పృషత్క నిషంగ రసద్భటశృంగ హతాఽవటుకే ।
కృత చతురంగబల క్షితిరంగ ఘటద్బహురంగ రట ద్వటుకే
జయ జయ హే మహిషాసురమర్దిని రమ్యకపర్దిని శైలసుతే ॥ 8

ప్ర॥ దనుజ సుసంగర – రాక్షసుల తోడి మహా యుద్ధమున, రక్షణ – ఆత్మీయ రక్షణ కార్యము యొక్క, సంగ – సంగతిచే, పరిస్ఫురత్ – ఎక్కువగా గదలుచున్న, అంగ – అవయవముల యందు (చేతులయందు), నటత్ – కదలాడుచున్న, కటకే – కర కంకణములు గలదానా, కనక పిశంగ – పసిడి చాయగలవై మెఱయుచున్న, పృషత్క – బాణములయొక్క, నిషంగ – విశేష సంగతిచే, (షంజ – సంగే) రసత్ – ద్రవించిపోవుచున్న (చెదరిపోవుచున్న) భట శృంగ – మహావీరులను (భటులతో కొండకొమ్ము వంటివారు – సమున్నతులు) హత – అవటుకే – కొట్టబడిన పెడతలలు గలవారుగా జేసినదానా, కృత – వ్యూహములుగా దీర్చబడిన, చతురంగబల – రథ, గజ, తురగ, పదాతి బలములచే, క్షితిరంగ – యుద్ధభూమి

యందు, ఘటత్ – సంసిద్ధములగుచున్న, బహురంగ – అనేకములైన రణరంగముల యందు, రటత్ – కోలాహల మొనరించు, వటుకే – "వటుక" గణములు గలదానా (వటుక రూపమున అంబిక వెంట అంబికానుగ్రహము చేతనే శక్తివంతులై చరించుచు. అంబికను సేవించు దేవతలు వీరు వివిధ నామములతో వివిధ సామర్థ్యములతో విలసిల్లుచు "వటుక" నామమున ప్రసిద్ధులు. తమ్ము ఉపాసించువారలకు శుభములను అనుగ్రహించు చుందురు.

శ్లో॥ శ్రీనాథాది గురుత్రయం గణపతిం పీఠత్రయా భైరవం
సిద్ధౌఘం "వటుకత్రయం"...... వందే గురోర్మండలమ్ ॥

"శ్రీస్కందవటుక శ్రీ విరించి వటుక శ్రీ చిత్రవటుక" నామములతో ప్రసిద్ధులైనవారు ఈ శ్లోకమున "వటుకత్రయముగా" పేర్కొనబడినారు. "ఆపదుద్ధరణ వటుకాదులు" ఇతర స్థలములయందు పేర్కొనబడిన వారలున్నారు) శైలసుతే... రమ్యకపర్దిని... జయజయ.

తా॥ కపర్ద నామకమైన జటాజూటముతో విలసిల్లుచున్న ఓ గిరినందినీ! దుర్దాంతుడైన మహిషాసురుని మడియచేసిన ఓ మహాదేవీ! దానవులతో నీవు సాగించిన సమరము ఆశ్చర్యకరమైనది! రక్షణకార్య వ్యగ్రములై అంతటను తామే అయి వివిధగతుల కదలాడుచు నర్తించుచున్న కంకణగణములచే మనోహరములైన కర నికరము (చేతులు) గల తల్లీ! నీకు జయము. పసిడిచాయల జిమ్ముచు మెఱయుచున్న నీ బాణముల తాకిడికి నిలువజాలక చెల్లాచెదరగుచున్న శత్రువీరుల పెడతలలను బాణపరంపరతో వడివడి బిట్టు గొట్టిన నీ యుద్ధ చాతుర్యమునకు జయము జయము! అసురులతోడి యుద్ధమున నీ చతురంగ బలములు గల్పించిన వివిధ రణవేదికలను జేరి నీ వటుక బృందము సమరోత్సాహముతో సాగించిన కోలాహలము అపూర్వమైనది. నిరుపమాన పరాక్రమశాలినివైన నీకో అంబా! శత సహస్ర విజయాభినందనలు.

శ్లో॥ జయజయ! జప్యజయే! జయశబ్దపర స్తుతి తత్పర విశ్వనుతే
ఝుణఝుణ ఝింఝిమి ఝింకృత నూపుర శింజిత మోహిత భూతపతే ।
నటిత నటార్థ నటీనట నాయక నాటిత నాట్యను గానరతే
జయ జయ హే మహిషాసురమర్దిని రమ్యకపర్దిని శైలసుతే ॥ 9

ప్ర॥ జప్యజయే – జపింపదగిన జయగాథ గల తల్లీ!, జయశబ్దపర – చివర జయశబ్దముగల, స్తుతి – స్తోత్రమున (మహిషాసుర మర్దినీ స్తుతి) తత్పర – ఆసక్తిగలదానా, విశ్వనుతే – ఎల్లరచే గొనియాడబడు జననీ! జయ జయ – జయింపుము జయింపుము, ఝుణఝుణ ఝింఝిం అని మెఱయుచున్న, నూపుర శింజిత – కాలి అందెల మధుర ధ్వనులచే, మోహిత – పరవశుడుగా చేయబడిన, భూతపతే – భూతనాథుడు (శివుడు) గలదానా, నటిత – నటింపబడిన, (ఆడబడి, అభినయింపబడిన) నట + అర్థ – సకల నట ప్రయోజనములును గలవారైన, (సర్వములైన నాట్యభంగిమల యందును విశారదులైన) నటీనట – నటీనటులకు, నాయక – నాయకుడైన వానియొక్క అనగా "నటరాజు" యొక్క, నాటిత – నాట్యమునకు, "నాటి + అనుగానరతే" నాటి – నాటరాగము గలదైన, అనుగాన – అనుసరగానమున (సాగుచున్న నాట్యమును అనుసరించు పాటయందు), రతే – ఆసక్తి గలదానా, శైలసుతే... రమ్యకపర్దిని... జయజయ.



తా॥ సొగసులెగయు కపర్దనామక జటామండలముతో విభాసితమైన ఓ గిరిరాజ కన్యామణీ! మహిషుడనెడు మహాసురుని ఇట్టె గొట్టి నేల గూల్చి ధ్వంసముచేసిన జగదంబికా! నీ విజయగాథలే జపింపదగినవి. (చండీ సప్తశతిలోని – "మధుకైటభవధ, మహిషాసురవధ, శుంభ నిశుంభవధ" అనెడు మూడు చరిత్రలు అంబిక యొక్క విజయగాథలు. అవన్నియును మంత్రములే. అంబికానుగ్రహము నందగోరు వారల కా చరిత్రములు నిత్యము ఆవశ్యము జపింపదగినవి.) నీవో, చివర – జయజయ కారములతో సముల్లసితముగుచున్న స్తోత్రములయందు ఆనందించుదానవు. ఎల్లరచే వినుతింపబడు ఓ సకల జననీ! జయ జయ. అమ్మా! నీ కాలి అందెలు "ఝుణ ఝుణ ఝిం ఝుమి ఝుం"అని సరసమధురముగా ధ్వనించుచు ఆ భూతనాథునకు శివునకు పారవశ్యమును దెచ్చి పెట్టుచుండును. సర్వవిధ నాట్యభంగిమలయందును విశారదులై విలసిల్లునటీనట వర్గములకు నటరాజు నాట్యమాడుచుండగా నాట రాగముతో తదనుకూలగానమును సాగించి మరియుచుందువు. ఓ దేవీ! జయ జయ.

శ్లో॥ అయి సుమన స్సుమన స్సుమన స్సుమన స్సుమనోహర కాంతియుతే
శ్రితరజ నీరజ నీరజనీ రజనీ రజనీకర వక్త్రవృతే ।
సునయన విభ్రమర భ్రమర భ్రమర భ్రమర భ్రమరాధిపతే
జయ జయ హే మహిషాసురమర్దిని రమ్యకపర్దిని శైలసుతే ॥ 10

ప్ర॥ అయి – ఓ, సుమనః – విద్వాంసులకు, సుమన స్సుమనః – దేవతలకును దేవతలైన బ్రహ్మాదులకును, సుమన స్సుమనోహర – పూలవలె అధికము

మనోహరమైన, కాంతియుతే – కాంతితో గూడినదానా, శ్రితరజ – రజోగుణమును ఆశ్రయించిన వారలకు, నీరజ – రజోగుణ రహితులకు (సత్వగుణ సంపన్నులకు), నీరజనీ – మేఘములతోగూడిన (నిండిన) (నీరస్య జలస్య జనిః ప్రాదుర్భావః యస్మాత్ మేఘః జనీ (ప్రాదుర్భావే). రజనీ – కాళరాత్రి వంటి, రజనీకర – చంద్రునివంటి, వక్త్రవృతే – మొగముగలదానా, (రజోగుణ యుక్తులకు సత్వగుణసంపన్నులకు కాళరాత్రివంటి నిండుచందురుని వంటి మొగము గలదని క్రమాలంకారము; రజస్ శబ్దము సకారాంతము, ఆకారాంత శబ్దమునకు "ద్విరూప నిఘంటువును" చూచునది.) సునయన – అందమైన కన్నులయొక్క, విభ్రమర భ్రమర – విలాసములయొక్క విశేష భ్రమణములనెడు, భ్రమర – తుమ్మెదల యందు, భ్రమర భ్రమరాధిపతే – భ్రమించు గండు తుమ్మెదలు గలదానా! శైలసుతే... రమ్యకపర్దిని... జయజయ.

తా॥ కమనీయ కపర్దాలంకృతమైన ఓ అద్రికన్యామణీ! మహిషాసుర సంహారిణీ! నీకు జయము. తల్లీ! నీవు ఆత్మజ్ఞాన సంపన్నులైన పండితులకు దేవాధిదేవులైన బ్రహ్మాదులకును పూలవలె మిక్కిలి మనోహరమైన కాంతి గలదానవై గోచరింతువు. అమ్మా! నీకు జయము. (దుష్టులకైనచో కాలయమునివలె గోచరింతువు. చూ. సప్తశతి 4వ అధ్యాయము – 12, 13 శ్లోక మంత్రములు) అంబా! రజోగుణ దూషితాత్ములకు నీ మొగము మేఘ బృందముతో నిండిన కాళరాత్రివలె భీకరముగా గన్పట్టును; సత్వగుణ సంపన్నులకు పూర్ణిమా చంద్ర బింబమువలె దోచును. జననీ! నీకు జయము! మహాదేవీ! నీ సుందర నేత్ర విలాస గతులు తుమ్మెదల వలె చెలంగుచుండగా వాని యందు గండు తుమ్మెదలు భ్రమించుచున్నవి. "దుష్ట శిక్షణ శిష్టరక్షణ కార్య" పటీయసివైన పరమేశ్వరీ! నీకు జయము! జయము! (స్త్రీల చూపులను నల్లని తుమ్మెదలుగా వర్ణించుట కవి సంప్రదాయము. ఇచ్చట పరమేశ్వరియొక్క కన్నుల నుండి చెలంగుచున్న విలాసముల యొక్క చంచలగతులు తుమ్మెదలుగా రూపింపబడెను. వానియందు స్వజాతి భ్రాంతితో గండు తుమ్మెదలు వర్తించు చున్నవని వర్ణింపబడెను. ఇది రూపకానుప్రాణితమైన భ్రాంతిమదలంకారము.)

శ్లో॥ కర మురళీరవ వీజిత కూజిత లజ్జిత కోకిల మంజుమతే
మిళిత మిళింద మనోహర గుంజిత రంజిత శైల నికుంజగతే।
మృగగణ భూత మహాశబరీగణ సద్గుణ సంభృత కేళిభృతే
జయ జయ హే మహిషాసురమర్దిని రమ్యకపర్దిని శైలసుతే ॥ 11



ప్ర॥ కర – చేతిలోని, మురళీరవ వీజిత – మురళీ నాదతరంగములచే, కూజిత లజ్జిత – కూయుటకు సిగ్గుపడునట్లు చేయబడిన, కోకిల – కోకిలల, మంజుమతే – సుకుమారములైన మానసములు గలదానా, మిళిత మిళింద – గుంపులుగా గూడిన తుమ్మెదల, మనోహర గుంజిత – రమణీయ ఝుంకారములచే, రంజిత – సుందరముగా దీర్చబడిన, శైల నికుంజ – కొండలమీద పొదరిండ్లను, గతే – పొంది విహరించుదానా, మృగగణ – మృగములుగా రూపుదాల్చిన ప్రమథగణములయొక్క, భూత మహాశబరీగణ – సువిశాలములైన శబరీ గణములుగా ఆకృతి దాల్చిన భూతములయొక్క (మృగ భూతాః గణాః, భూతా ఏవమహాశబరీ గణాః, అనియు విగ్రహము,) సద్గుణ సంభృత – సుగుణములతో నిండిన (ఆయా వేషములకు తగిన గుణస్వభావప్రాకట్యముతో నిండిన) కేళి – క్రీడా వినోదములచే, భృతే – భరింపబడినదానా! (వినోదించిన తల్లీ!) శైలసుతే... రమ్యకపర్దిని... జయజయ.

తా॥ రమ్యకపర్దాలంకృతమైన మహిషాసురుని మర్దించిన ఓ కొండలరాయని కూరిమి పట్టీ! నీ చేతిలోని మురళి నుండి వెల్వడుచున్న మధురనాద తరంగముల నాలకించి కోకిలలు మనసులో కుంచించుకొనిపోయి "కో" అని ఎలుగెత్తి కూయుటకు లజ్జించుచున్నవి. మురళీనాదన కోవిదవైన తల్లీ! నీకు జయము. అమ్మా! బహుళములైన తుమ్మెదల ఝుంకారములచే రమ్యములైన కొండలమీద పొదరిండ్లను జేరి విహరించుచుందువు. నిత్య వన విహార రసికవైన నీకు జయము. జననీ! శివుడు ఆది కిరాతకుడుగా వేసము దాల్చినపుడు నీ వాయన వెంట శబరీ వేషము" (చెంచెతరూపు) దాల్చి చరించినావు. ప్రమథుల గణములు మృగములుగా మారగా భూతములు చెంచెతలుగా మారినారు. వారు తాము దాల్చిన వేషములకు అనుకూలములైన గుణస్వభావములను బ్రకటించుచుండగా క్రీడించి వినోదించినావు. తల్లీ! నీకు జయము జయము.

శ్లో॥ కమల దళామల కోమల కాంతి కళా కలితాతుల బాలలతే
సకల కళానిచయ క్రమకేళి చలత్కల హంసకులాళికులే।
అలికుల సంకుల కువలయ మండిత మౌళి మిళద్బకులాళికులే
జయ జయ హే మహిషాసురమర్దిని రమ్యకపర్దిని శైలసుతే ॥ 12

ప్ర॥ కమలదళ – తామరపూల రేకులలోని, అమల కోమల – నిర్మలమై, మృదువైన, కాంతి కళా – కాంతియొక్క సమృద్ధితో, కలిత – ఒప్పిన, అతుల – సాటిలేని, బాలలతే – బాలాత్రిపుర సుందరిరూపమున విలసిల్లిన ఓ కల్పలతా,

(బాలైవ లతా బాలలతా అని విగ్రహము) సకల కళానిచయ – సకల కళా సమూహముతో నిండిన, క్రమకేళి – విలాస గమనములతో (క్రమ పాదవిక్షేపే), చలత్ – నడుచుచున్న, కల హంసకుల + ఆళికులే – రాజహంసవంటి సఖీగణములు గలదానా, అలికుల సంకుల – తుమ్మెదల గుంపులతో, కువలయ – కలువలచే, మండిత – అలంకరించ బడిన, మౌళి – శిరస్సుతో, మిళత్ – కలియుచున్న (శిరసును దాకుచున్న) వకుళ + అళికులే – బొగడమల వరుసలు గలదానా, శైలసుతే... రమ్యకపర్దిని... జయజయ.

తా॥ హిమగిరిసుతవై కపర్దాలంకృత శిరోభాగవై మహిషరక్ష శ్శిక్షణ దక్షవై చెలంగిన తల్లీ! నీకు జయము. ఎఱ్ఱ తామరపూల రేకులలోని అరుణ కోమల కమనీయ కాంతులతో బాలాత్రిపుర సుందరీ స్వరూపమున వెలసియున్న కల్పలతవు నీవు. జననీ! నీకు జయము. "అరుణ కిరణ జాలై రంజితాశావకాశా! నివసతు హృదిబాలా నిత్యకళ్యాణ శీలా!" అందచందములు చిందించు ఒయ్యారపు నడకలచే రాజహంసలను బోలిన వారైన సఖీగణములచే సేవింపబడు తల్లీ! నీకు జయము. అమ్మా! తుమ్మెదల గుంపులతో నిండిన కలువపూలను తలలో తురుముకుని వరుసగా నన్ను బొడగల నడుమ నడయాడువేళ ఆ బొగడలు నీ తలను దాకుచున్నవి. ఇట్లు వన సంచారశీలవై చలించు జననీ! నీకు జయము.

శ్లో॥ కటితట పీతదుకూల విచిత్ర మయూఖ తిరస్కృత చంద్రరుచే
ప్రణత సురాసుర మౌళి మణి స్ఫురదంశు లసన్నఖ చంద్రరుచే ।
జిత కనకాచల మౌళి పదోర్జిత నిర్జర కుంజర కుంభకుచే
జయ జయ హే మహిషాసురమర్దిని రమ్యకపర్దిని శైలసుతే ॥ 13

ప్ర॥ కటితట పీతదుకూల – కటిదేశమందలి పచ్చని పట్టుచీరయొక్క, విచిత్ర మయూఖ – చిత్రకాంతులచే, తిరస్కృత – తిరస్కరింపబడిన, చంద్రరుచే – చంద్రకాంతి గలదానా, ప్రణత – వంగిమ్రొక్కు చున్న, సుర + అసుర – దేవదానవుల, మౌళి మణి – శిరోరత్నముల నుండి, స్ఫురత్ – స్ఫురించు (వెలువడు), అంశు – కిరణములచే, లసత్ – ఒప్పుచున్న, నఖ చంద్రరుచే – చంద్రవంకలవంటి కాలిగోళ్ళ కాంతి గలదానా, జిత – జయింపబడిన, కనక + అచల – మౌళి పద – మేరు పర్వతశిఖర దేశము, ఊర్జిత – గొప్పవైన, నిర్జర కుంజర కుంభ – వేలుపుల ఏనుగుయొక్క (ఐరావతము) కుంభ స్థలములు గలవైన, కుచే – రొమ్ములు గలదానా, శైలసుతే... రమ్యకపర్దిని... జయజయ.



తా॥ శైలరాజకుమారీ! మహిషాసురు నుసురులను బెకలించిన మహాదేవీ! సుందర జటాకలాప సంశోభితవైన నీకు జయము. అమ్మా నీవు ధరించిన పచ్చని పట్టుచీర నీ కటి దేహమున చిత్ర కాంతులతో మెఱయుచుండగా దాని ముందు చంద్రకాంతి వెలవెలబోవుచున్నది. ఇట్లు – పీతదుకూల పరిశోభిత కటితలవైన నీకు జయ మగుగాక, తల్లీ! దేవతలు – దానవులు తలలు వంచి నీ పాదములకు మ్రొక్కుచున్న వేళ చంద్రవంకలవంటి నీ కాలిగోళ్ళు వారి శిరోరత్నముల కాంతులచే మిక్కిలి మెఱయుచున్నవి. అమ్మా! నీ పాద పద్మములకు జయమగుగాక. అంబా! నీ రొమ్ములు (సర్వ జగత్పరి పోషక ద్రవ్యముతో నిండియున్న వగుటచే) పసిడి కొండ కొమ్ములను మీఱి ఐరావత గజకుంభముల నతిశయించి విలసిల్లుచున్నవి. నిఖిల జగత్పరిపోషణ శీలవైన జననీ! జయ జయ.

శ్లో॥ అవిరళ గండ గళన్ మద మేదుర మత్త మతంగజరాజపతే
త్రిభువన భూషణభూత కళానిధి రూప పయోనిధిరాజసుతే ।
అయి! సుదతీజన లాలస మానస మోహన మన్మథరాజసుతే
జయ జయ హే మహిషాసురమర్దిని రమ్యకపర్దిని శైలసుతే ॥ 14

ప్ర॥ అవిరళ – ఎడతెగక, గండ గళన్ – గండస్థలముల నుండి జాలువారుచున్న, మద – మదజలముచే, మేదుర – దట్టమైన (అట్టలు గట్టియున్న), మత్త మతంగజరాజపతే – మదించిన గజరాజమున కధీశ్వరివై విలసిల్లినదానా, త్రిభువన భూషణభూత – మూడు లోకములకును అలంకారములైన, కళా – సంపత్సమృద్ధులకు (కలా శబ్దమునకు "మూలద్రవ్యవృద్ధి" అని అర్థమున్నది. (చూ॥గు॥ప) నిధి – నిధివైన, పయోనిధిరాజసుతే – క్షీరసాగర కన్యామణీ! లక్ష్మీదేవీ! అయి – ఓ, సుదతీజన – స్త్రీలయొక్క, లాలస మానస – కామ భావయుక్తములైన చిత్తములను (లేదా) సుదతీజన – స్త్రీలయెడ, లాలస మానస – లాలస చిత్తులైన కాముకులను, మోహన – మోహింపజేయు, మన్మథరాజ – మన్మథుడు, సుతే – కొడుకుగాకలదానా, శైలసుతే... రమ్యకపర్దిని... జయజయ.

తా॥ ఓ శైలరాజ కన్యామణీ! జయ, ఓ రమ్య జటాలంకృతా! జయ, ఓ మహిషాసురమర్దినీ! జయ! తల్లీ! నీవొకప్పుడు ఎడతెగక ప్రవహించు మద జలధారలచే అట్టలు గట్టిన దవడలు గల మదించిన గజరాజు నెక్కి విహరించుచుందువు. నీ నిరుపమవైభవ మునకు జయ జయకారముల నర్పించుచున్నాము. అంబా! భువనత్రయమును విభూషితమొనర్చు సంపత్సమృద్ధులకు నిధియైన క్షీరసాగర

కన్యామణియైన శ్రీలక్ష్మివి నీవే. జననీ! జయ జయ. దేవీ! కామినీ మానసములను, కాముక చిత్తములను మోహాక్రాంతముగా జేయజాలిన మన్మథుడు నీ కుమారుడు. ఓ మదన జననీ! జయజయ జయజయ.

శ్లో॥ సుర లలనా తత "ధేయి తధేయి త" తాళనిమిత్తజ లాస్యరతే
హసన విలాస విలాస్యమయి! ప్రణతార్త జనేఽ ఽ తిప్రేమధరే ।
ధిమికిత ధిక్కట ధింధిమిత ధ్వని ధీర మృదంగ నినాద రతే
జయ జయ హే మహిషాసురమర్దిని రమ్యకపర్దిని శైలసుతే ॥ 15

ప్ర॥ సుర లలనా – దేవాంగనలచే, తత – విస్తరింప జేయబడిన, "ధేయి తధేయి త" తాళ – "థేయ్ తథేయ్ త" అనెడి తాళము, నిమిత్త – కారణముగా, జ – పుట్టిన, లాస్య – లాస్యమని పిలువబడు మధురనృత్యమున. రతే – రమించుదానా, హసన విలాస – హాస్య విలాసములతో, విలాస్యమయి – విశిష్టమైన, లాస్యము రూపుగా గల దానా, ప్రణత + ఆర్తజనే – మ్రొక్కిన విపన్నగ్నమైన జనతయెడ, అతి ప్రేమధరే – అధికమైన ప్రేమను వహించుదానా, ధిమికిత ధిక్కట ధింధిమిత ధ్వని – "ధిమికిట ధిక్కిట ధిం ధిమిత" అనెడు ధ్వనితో, ధీర – ధీరమైన (బలముగా మ్రోగుచున్న) మృదంగ – మద్దెల యొక్క, నినాద రతే – మ్రోతలయందు ఆనందించు దానా, శైలసుతే... రమ్యకపర్దిని... జయజయ.

తా॥ రమ్యకపర్దినీ! గిరిరాజనందినీ! మహిషమర్దినీ జయ జయ. దేవాంగనలందరును చేరి "థేయ్ థేయ్ తథేయ్ థేయ్" అనుచు విస్తృతముగా సాగించు తాళమున కనుకూలముగా బరగు లాస్యమున రమించు తల్లీ! జయ జయ! హాసవిలాసములతో విశిష్టముగా సాగు లాస్యమే రూపముగా గల నీవు – మహా విపత్తులకు జిక్కి విలవిలలాడుచు నిన్ను శరణొందిన వారి యెడ అమితమైన ప్రేమను వర్షించుచు – వారిని గాచి రక్షింతువు. ఆర్తజన సంత్రాణ పరాయణవైన నీకు జయము. "ధిమికిట – ధిక్కట – ధిం – ధిం – త" బలముగా చెలంగుచున్న మర్దళ ధ్వనులయందు ఆనందించు తల్లీ! నీవు సదా సర్వథా జయపరంపరలతో విలసిల్లుము.

శ్లో॥ మహిత మహాహవ మల్ల మతల్లిక 'మల్లిత తల్లక' మల్లరతే
విరచిత 'వల్లిక పల్లిక మల్లిక ఝిల్లిక ఝిల్లిక' వర్గ భృతే ।
సిత కృత ఫుల్ల సముల్లసితారుణ పల్లవ తల్లజ సల్లలితే
జయ జయ హే మహిషాసురమర్దిని రమ్యకపర్దిని శైలసుతే ॥ 16



ప్ర॥ మహిత – ఘనులైన, మహా + ఆహవ మల్ల – మహారణమల్లురయందు, మతల్లిక – శ్రేష్ఠులైన వారితో, 'మల్లిత తల్లక' – మల్లితము తల్లకము అను పేరుగల, మల్ల – మల్లయుద్ధక్రీడలయుందు, రతే – ఆసక్తిగలదానా, విరచిత – రచింపబడిన, వల్లిక పల్లిక మల్లిక ఝిల్లిక ఝిల్లిక వర్గ – ఇత్యాది నామములతో నొప్పారుచున్న మల్లక్రీడా విశేషములతో, భృతే – నిండినదానా, సిత కృత – తెలుపుగా జేయబడిన, ఫుల్ల – వికసితములై, సముల్లసిత – లెస్సగా వెలయుచున్న, అరుణ పల్లవ తల్లజ – ఎఱ్ఱని మంచి చిగురాకులవలె, సల్లలితే – పరమ రమ్యమైన ఓ పరమేశ్వరీ! శైలసుతే... రమ్యకపర్దిని... జయజయ.

తా॥ మహిషమర్దినివైన ఓ యమ్మా! మల్లయుద్ధ విశారదులైన వీరవరులతో ఆయా మల్లయుద్ధ క్రీడల నాచరించుచు రమించు తల్లివైన నీకు జయము. (శుంభ నిశుంభులతో దేవి ఆచరించిన మల్లయుద్ధ క్రీడ ఇచట స్మరింపబడెను.) స్వయముగా సుప్రసిద్ధములైన అనేక మల్ల విద్యా విన్యాసములను బ్రదర్శించుచు విరాజిల్లు జననీ! నీకు జయము. తల్లీ! నీవు "తెలుపు విరుగుచున్న" మంచి ఎఱ్ఱని చిగురాకుల కాంతితో ఒప్పుచుందువు. అమ్మా! నీకు జయము. (అంబిక ఎఱ్ఱనిది. ఎఱుపు అన్నది అనేక విధములు. తల్లియొక్క దేహకాంతి "తెలుపు గలిగిన ఎఱుపు" అని చెప్పుట ఉద్దేశము. ప్రకాశ చరణాభిముఖమైన విమర్శ చరణము తెలుపు విరుగుచున్న ఎరుపురంగు గలదిగా నుండును. మిగిలినది – గురుముఖ సంవేద్యము.)

శ్లో॥ భజిత సహస్రకరైక సహస్రకరైక సహస్రకరైక నుతే
కృత సురతారక సంగర తారక సాగర తారక సూనునుతే ।
గజముఖ షణ్ముఖ రాజిత పార్శ్వ సుశోభిత మానస కంజపుటే
జయ జయ హే మహిషాసురమర్దిని రమ్యకపర్దిని శైలసుతే ॥ 17

ప్ర॥ సహస్రకర + ఏక – ఎన్నదగినవాడైన కార్త వీర్యునిచేతను, సహస్రకర + ఏక – ప్రాధాన్యము వహించిన బాణాసురుని చేతను, సహస్రకర + ఏక – ముఖ్యుడైన సూర్యునిచేతను, (సహస్రకరుడు – వేయిచేతులు లేదా కిరణములు గలవాడు, ఏకే ముఖ్యాన్యకేవలాః అమరము, ఏక – ముఖ్యుడు), భజితా – సేవింపబడి, నుతే – కొనియాడబడిన దానా (భజితా చ స నుతాచ విశేషణ ఉభయ పదము). కృత – చేయబడిన, సురతారక సంగర – దేవతలనందరను ఒడ్డునపడవేయు సంగరము గలవాడై, తారక సాగర తారక – తారకా సురుడను సముద్రమును దాటించిన, సూను – కుమారునిచే, నుతే – వినుతింపబడినదానా, గజముఖ – గణనాథునితోడను,

షణ్ముఖ – కుమారస్వామితోడను, రాజిత – ప్రకాశించు, పార్శ్వ – ఇరు పార్శ్వములను గలదానవై, సుశోభిత – ఆనందముతో కలకలలాడు, మానస కంజ పుటే – హృదయ పద్మము గలదానా, శైలసుతే... రమ్యకపర్దిని... జయజయ.

తా॥ అమ్మా! నీవు గిరినందినివి. రమ్యకపర్దినివి. మహిషమర్దినివి. నీకు జయము తల్లీ! సహస్రకరుల యందెన్నదగిన వారలైన కార్తవీర్యుడు, బాణాసురుడు, సూర్యుడు నిన్ను సేవించి వినుతించియే అంతవారలైనారు. అంతియేకాదు, నీ కుమారుడైన కుమారస్వామి కూడా నిన్ను వినుతించియే సురతారకమైన సంగ్రామ మొనరించి తారకాసురుడనెడు భీకర సాగరమును దాటింపగల్గెను. ఏనుగు మొగముగల కుమారుడొక వంక (వినాయకుడు) ఆరుమొగముగల కుమారుడొక వంక (కుమార స్వామి) కూర్చుండగా వారి నడుమ, ఆనంద తుందిలమైన మానసముతో జగద్రక్షణ శీలవై విలసిల్లు తల్లివి – నీకు జయ జయ పరంపరాభినందనలు.

శ్లో॥ పదకమలం కరుణానిలయే వరివస్యతి యోఽను దినం స శివే!
అయి కమలే కమలానిలయే కమలానిలయ స్స కథం న భవేత్ ।
తవ పదమేవ పరంపదమిత్యనుశీలయతో మమ కిం న శివే
జయ జయ హే మహిషాసురమర్దిని రమ్యకపర్దిని శైలసుతే ॥ 18

ప్ర॥ కరుణానిలయే – దయానిధానమమైన, తల్లీ! అయి కమలే – ఓ పరబ్రహ్మ పట్టమహిషీ, (కంబ్రహ్మాణం అలంకరోతి కమలా) శివే – ఓ సర్వ మంగళా, యః – ఎవడు, అనుదినమ్ – నిత్యము, పదకమలమ్ – నీ పాదపద్మమును, వరివస్యతి – భజించునో, సః – వాడు, కథమ్ – ఎట్లు, కమలానిలయః న భవేత్ – లక్ష్మీ నిలయుడు కాకుండును! తవ పదం ఏవ – నీ చరణమే, పరం పదం ఇతి – పరమపదమని (సర్వోత్కృష్టస్థానమని) అనుశీలయతః – గాఢముగా భావించుచున్న, మమ – నాకు, కిం న – లేనిదేమిటి? (అన్నియును ఉన్నవి నాకు ఏమియు లోపము లేదు) శైలసుతే... రమ్యకపర్దిని... జయ జయ.

తా॥ ఓ మహిషదైత్య నిర్మథన పండితా! శైలసుతా! రమ్యకపర్దోపశోభితా! జయ జయ. కరుణనిలయా! పరబ్రహ్మ పట్టమహిషీ! సర్వమంగళా! నిత్యము నీ చరణకమలము నారాధించువాడు సకల సంపత్సమృద్ధులతో విరాజిల్లకుండునా? నాకేమి లోపము! తల్లీ! నీవు జయపరంపరలతో విభాసిల్లుము.



శ్లో॥ కనక లసత్ కలశాబ్ధి జలై రనుసించినుతే గుణరంగభువం
భజతి స కిం న శచీ కుచకుంభతటీ పరిరంభ సుఖమ్ ।
తవ చరణం శరణం కరవాణి నతామరవాణి నివాసి శివే
జయ జయ హే మహిషాసురమర్దిని రమ్యకపర్దిని శైలసుతే ॥ 19

ప్ర॥ కనక – సువర్ణముతో జేయబడినదై, లసత్ – ఒప్పుచున్న, కలశ – జలపాత్రయందలి, అబ్ధి జలైః – సరోవరజలములచే, యః – ఎవడు (అధ్యా హారము), గుణరంగభువం – సత్త్వ రజస్తమస్సులనెడు మూడు గుణములకు రంగభూమివైన నిన్ను (త్రిగుణాత్మికవైన నిన్ను), అనుసించినుతే – అభిషేకించునో, సః – వాడు, శచీ – శచీదేవి యొక్క, కుచకుంభతటీ – కుంభములవంటి కుచముల పార్శ్వముల, పరిరంభ – కౌగలింతవలని, సుఖానుభవమ్ – సుఖానుభవమును, భజతి న కిమ్ – ఏల పొందదు? (పొంది తీరును అని అర్థము), నత – మ్రొక్కిన, అమర – దేవతల, వాణి – వాక్కులయందు, నివాసి – నివసించెడు, శివే – ఓ సర్వమంగళా, తవ – నీ యొక్క, చరణమ్ – పాదములను, శరణం కరవాణి – శరణొందెదను. శైలసుతే... రమ్యకపర్దిని... జయజయ.

తా॥ అమ్మా! విమలములైన సరోవర జలములను బంగారు పాత్రలతో దెచ్చి త్రిగుణాత్మికవైన నిన్ను అనుదినము అభిషేకించి ఆనందించు భక్తుడు మహేంద్ర సౌఖ్యమును అనుభవించుననుటయందు అబ్బురమేమున్నది. నీకు మ్రొక్కెడు దేవతల వాక్కులయందో తల్లీ! నీవు నివసించుచున్నావు. తల్లీ! నిన్ను శరణొందుచున్నాను. గిరిసుతా నీకు జయము.

శ్లో॥ తవ వదనేందు మలం విమలేందుకలా సకలం ననుకూలయతే
కిము పురుహూత పురీందు ముఖీ సుముఖీభి రసౌ విముఖీక్రియతే ।
మమ తు మతం శివనామధనే భవతీకృపయా కిముతక్రియతే
జయ జయ హే మహిషాసురమర్దిని రమ్యకపర్దిని శైలసుతే ॥ 20

ప్ర॥ సకలమ్ – కాంతియుక్తమైన, తవ వదనేందుమ్ – నీ ముఖ చంద్రుని, విమలేందుకలా – స్వచ్ఛమైన చంద్రకళ, అలమ్ – అధికముగా, కూలయతే నను – ఆశ్రయించియున్నది కదా! (కూల – ఆచ్ఛాదనే) అసౌ – ఈ చంద్రుడు, పురుహూత – ఇంద్రునియొక్క, పురీ – నగరములోని, ఇందుముఖీ సుముఖీభిః – అభిముఖలై వర్తిల్లు చంద్రవదనలచే, విముఖీక్రియతే కిము – విముఖుడుగా జేయబడుచున్నాడా

ఏమి? (దేవాంగనా ముఖకాంతులచే పరాజితుడై ఆ చంద్రుడు నిన్నాశ్రయించినాడా? అని భావము) శివనామధనే – శివనామమే ధనముగా గలవానియందు (శివభక్తునియందు) భవతీకృపయా – నీ దయచే, తత్ – అది, క్రియతే కిము – ఆచరింపబడుచున్నదేమో అని, మమతు మతం – నా అభిప్రాయము, శైలసుతే... రమ్యకపర్దిని... జయ జయ.

తా॥ అమ్మా! చంద్రుడు కలారూపియై నీ ముఖచంద్రుని ఆశ్రయించి యున్నాడు కదా! దేవాంగనల ముఖ సౌందర్యముచే పరాజితుడగుటయా దీనికి కారణము. అది కాదు – శివభక్తులయెడ నీకు గల దయావిశేషము అపారము. చంద్రకల నీ ముఖమున శోభించుటకు చంద్రుని శివభక్తియే కారణమని నా అభిప్రాయము జననీ! జయజయ.

శ్లో॥ అయి మయి దీనదయాళుతయా కృపయైకతయా భవితవ్య ముమే
అయి జగతో జననీ కృపయోఽసి యథాఽసి తథాను గతానురతే।
యదుచిత మత్ర భవ త్యురరీ కురుతా దురతాప మపాకురుతే
జయ జయ హే మహిషాసురమర్దిని రమ్యకపర్దిని శైలసుతే ॥ 21

ప్ర॥ అయి ఉమే – ఓ ఉమాదేవీ!, దీనదయాళుతయా – దీనులయెడ దయ జూపు ధర్మముకల దానవగుటచే త్వయా – నీచే, మయి – నా యందు, కృపయైవ భవితవ్యమ్ – దయతోడనే ఉండదగును, అయి జగతః + జననీ – ఓ జగజ్జననీ, అనుగత + అనురతే – శరణొందిన వారియెడ ప్రసన్నతను గనబరచు తల్లీ! కృపయా + యథా + అసి – దయతో ఎట్లు ఉన్నావో, తథా – అటులే, అసి – ఉన్నావు ("నీ దయా స్వభావమున మార్పులేదు." అని అర్థము) భవతీ – నీవు, అత్ర – ఇచట (ఈనా విషయమున) యత్ + ఉచితమ్ – ఏది తగునో (దానిని) ఉరరీ కురుతాత్ – పెంపొందించెదవుగాక, భవతీ – నీవు, ఉరు తాపం – గొప్పదైన సంసార తాపమును, అపాకురుతే – తొలగించుచున్నావు. శైలసుతే... రమ్యకపర్దిని... జయజయ.

తా॥ ఓ శైలరాజ కన్యామణీ! రమ్యకపర్దోపశిఖితా! మహిషదైత్య ప్రాణాపహరణ చాతుర్య ధుర్యా! జయ జయ ఓ ఉమాదేవీ! దీనులను దయజూచుట నీ ధర్మము. నాకంటె దీనుడు లేడు. జగజ్జననీ! నీవు శరణత్రాణపరాయణవు. అందుచే నీవు నన్ను దయతోడనే చూడవలయును. (లేకున్న నీ ధర్మమే లోపించును సుమా!) సాంసారిక తాపము నెల్ల హరించెడి తల్లీ! నీవు నాకేమి యిచ్చుట తగునో దానినెల్ల సమృద్ధిగా ప్రస్తావించి కరుణజూడుము.



## ఫలశ్రుతిః

శ్లో॥ స్తుతి మితి స్తిమితస్తు సమాధినా
నియమితోఽయమితోఽనుదినం పఠేత్।
పరమయా రమయా సతు సేవ్యతే
పరిజనోఽపి జనోఽపి చ తంభజేత్ ॥ 22

ప్ర॥ ఇతి స్తుతిమ్ – ఈ విధముగా నన్ను ఈ స్తుతిని, సమాధినా స్తిమితః – మంచి ఏకాగ్రతచే కదలికను వీడిన చిత్తము గలవాడై, అనుదినమ్ – ప్రతి నిత్యము, యః తు – ఎవడైతే (యః – అధ్యాహారము) పఠేత్ – చదువునో, సఃతు–వాడైతే పరమయా రమయా – మహా సంపత్తిచే మహా సమృద్ధిచే, సేవ్యతే – సేవింపబడును, పరిజనః+అపి–సేవకజనము, జనః+అపి చ – ఇతర జనతయునుగూడ, తమ్ – వానిని, భజేత్ – సేవించును.

తా॥ ఇంద్రియ నిగ్రహము నియమపాలనము గలవాడై ఈ స్తుతిని నిత్యము ఏకాగ్రచిత్తుడై పఠించువాడు సకల సంపత్సమృద్ధులతో నిండినవాడై ఎంతయో పరిజనము (సేవకజనము) కలవాడై పరిఢవిల్లును. అతడు సర్వజనసంసేవ్యుడై విరాజిల్లును.

శ్లో॥ రమయతి కిల కర్ష న్నేష చిత్తం నరాణా–
మపరజపర మస్మాద్ రామకృష్ణః కవీనామ్।
అకృత సుకృత గమ్యం రమ్య పద్యైక హర్మ్యం
స్తవన మవనహేతుం ప్రీతయే విశ్వమాతుః ॥ 23

ప్ర॥ కవీనాం – కవులలో, ఏషః – ఈ, రామకృష్ణః – రామకృష్ణుడు, నరాణాం చిత్తమ్ – మానవుల చిత్తమును, అపరజ – రజోగుణ రహితమైన తేజమునందు, పరమ్ – ఆసక్తి కలదిగా, కర్షన్ – ఆకర్షించుచు, రమయతి కిల – రమింపజేయుచున్నాడు కదా, అస్మాత్ – ఇందువలన, విశ్వమాతుః – జగజ్జనని యొక్క, ప్రీతయే – ప్రీతికై, అవనహేతుమ్ – రక్షణకు హేతువైన, స్తవనమ్ – ఈ స్తుతిని, సుకృత గమ్యమ్ – పుణ్య లభ్యమైన దానిని, రమ్య పద్యైక హర్మ్యమ్ – సుందరములైన శ్లోకములే ముఖ్యప్రాసాదముగా గల దానిని, ఆకృత – రచించెను. (నిర్మించెను)

తా॥ రామకృష్ణకవి మనుజుల చిత్తములను ఆకర్షించి రజసః పరమై వెలయు అంబికా చరణ యుగము వంకకు ఆకర్షించి, అందు రమింపజేయుచు జగజ్జననీ ప్రసన్నతను వాంఛించి ఎన్నో పున్నెముల పంటను వెంట బెట్టుకొన్న సాధకోత్తమునకు మాత్రమే లభ్యము కాదగిన ఆత్మరక్షణ హేతువైన ఈ స్తుతిని ఈ సుందర పద్యప్రాసాదమును విరచించినాడు.

వి॥ అన్నమయము, ప్రాణమయము, మనోమయము, బుద్ధిమయము, ఆనంద మయము అని కోశములైదు. అనగా స్థూల శరీరములైదు. సామాన్యజనులు అన్నమయ కోశమునందే రమింతురు. ఎవ్వని అన్నమయ ప్రాణమయ కోశములు రెండును వికసించునో వాడు బలశాలి యగును. కవులున్నారు. వారు కల్పనాశీలురు. కల్పన అన్నది మనస్సాధ్యమైన పని కాగా కవుల విహారభూమి మనోమయకోశము, ప్రాణమయ మనోమయకోశముల సమవికాసముతో కలము బట్టిన కవియొక్క భాష ఝంఝూమారుతము, సాగర వీచీనికురంబము. ఉత్తాలము. బుద్ధిమయకోశ వికాసము గలవాడు తత్త్వవేత్తయగును. మనోమయ బుద్ధిమయకోశముల నడుమ ఉదయించిన కవి యొక్క కవిత స్వర్లోక సువాసనలతో గుబాళించుచు ఆధ్యాత్మిక తేజముతో విరాజిల్లుచుండును. ఇట్టి కవులు అరుదు. కథలు, నాటికలు, నవలలు, పాటలు, పద్యములు రచించి లోకుల చిత్తములకు సహజమైయున్న లోకాభిముఖప్రవృత్తిని పెంచి వారిని రమింపజేయగల కవులు కోకొల్లలు. లోకమువంకకు వేగముగా పరువెత్తుచున్న జన మానసముల వేగమును నిరోధించి, వానిని వెనుకకు మరల్చి రజోగుణపరిధిని దాటించి, శుద్ధ సత్వ భూమి యందు వానిని (లోకుల చిత్తములను) రమింపజేయగల కవిత చెప్పగలవారు ఎక్కడనో నూటికి ఒకరుందురు. ఈ స్తుతిని రచించిన రామకృష్ణుడు అట్టి కవి. భౌతిక విషయములయందు వలె ఆధ్యాత్మిక విషయములయందు సామాన్యుల చిత్తము రమింపదు. కాని ఈ కవి యొక్క కవితా శిల్పము ఎంత సుందరమైనదనగా విషయలంపటులైన జనుల చిత్తములను సైతము ఈ శిల్పము అంబికా చరణయుగ్మము వంకకు ఆకర్షింపగలదైయున్నది. అచట రమింపజేయగలదై యున్నది. అనేక సుకృతములు కలిసివచ్చిననాడు మాత్రమే ఆత్మోద్ధారమునకు ఉపయోగించు ఇట్టి స్తుతి చేజిక్కును, ఇదొక సుందర పద్య ప్రాసాదము అని కవియే చెప్పినమాట.

('పరోరజసి సావదోం' అన్నది గాయత్రీ మంత్రముయొక్క నాల్గవపాదము. రజసః పరః పరో రజః అని విగ్రహము. రజోగుణమునకు పరమై వెలయుచున్నది.



నాకు రక్షకమగుగాక" అన్నది దీని భావము. "అపరజ పరం" అన్నచోట "రజస్" శబ్దము ఆకారాంతముగా ఉపయోగింపబడెను. "సకారాంతాః ప్రాయశః ఆకారాం తాభవంతి" అని సూత్రము)

శ్లో॥ ఇందురమ్యో మహ ర్బిందురమ్యో ముహు–
ర్బిందు రమ్యో యతః సానవద్యం స్మృతః ।
శ్రీపతేః సూనునా కారిత స్సోఽధునా
విశ్వమాతుః పదే పద్య పుష్పాంజలిః ॥ 24

ప్ర॥ బిందురమ్యః – బిందువుచే సుందరమైన, ముహుః – మాటి మాటికి, బిన్దురమ్యః – బిందువులచే రమ్యమైన, ఇందురమ్యః – చంద్రునిచే సుందరమైన, మహః – తేజము, యతః – ఎందువలన (దేవి ద్వారా), సానవద్యమ్ – అనిందితముగా, స్మృతః – స్మరింపబడెనో, సః – ఆ, పద్యపష్పాంజలిః – పద్యకుసుమాంజలి, శ్రీ పతేఃసూనునాః – శ్రీ పతి కుమారునిచే (రామకృష్ణకవిచే) విశ్వమాతుః – జగజ్జనని యొక్క పదే కారితః – పాదముల యందర్పింపబడెను. (మహశ్శబ్దము పుంలింగమున్నూ కలదు. చూ – అమరకోశము – నవదనీయం, అవద్యం – పలుకరానిది, నిందితము, న అవద్యం అనవద్యం అనిందితము, అనవద్యేన సహితం యథా తథా సానవద్యం.)

తా॥ ఈ పద్యములయందు, ఇందు రమ్యము, బిందు రమ్యము మరల బిందురమ్యము అయిన తేజము లెస్సగా సంస్మరింపబడినది. శ్రీ పతి కుమారుడైన రామకృష్ణ కవి తాను కూర్చిన ఈ పద్యకుసుమాంజలిని జగజ్జనని శ్రీ చరణముల యందర్పించుచున్నాడు.

వి॥ పరమేశ్వరి చంద్రరేఖాసమలంకృత శిరోబాగ. అందుచే ఆమె ఇందురమ్య. పరమేశ్వరిని బ్రాపింపచేయు విద్యకు చంద్రకళావిద్య అని పేరున్నది. సాధకోత్తమునకు (సుషుమ్నయందు కుండలినీశక్తిని జాగృతను గావించి సహస్రారము వరకు నడుపగలవానికి) దన సహస్రారమున బరమేశ్వరి పూర్ణచంద్రబింబాకృతిగా గోచరించును. అనుభవమునకు వచ్చును. అందుచే గూడ ఆమె 'ఇందురమ్య'. బిందురూపీ మహేశ్వరః శ్రీ చక్రమున బిందువు శివుడే. శివునే పర్యంకముగా జేసికొన్నదై పరమేశ్వరి వెలయుచున్నది. అందుచే ఆమె బిందురమ్య.

## ముహుర్బిందురమ్య

'బిందువు శివుడు రెండు బిందువులు (విసర్గము) పరమేశ్వరి' అన్నది మంత్రశాస్త్ర సంప్రదాయము 'సర్గము' అనగా సృష్టి 'విసర్గము' విశేష సృష్టి, సృష్టియొక్క ఫలితార్థము "ప్రసవము, విడుదల" విసర్గోచ్చారణమున గాలి బయటకు వదలబడును. బిందూచ్చారణమున గాలి కదలికను కోల్పోవును. 'హంస' మంత్రమున ''హం" శివవాచకము. సో (సః యొక్క రూపమే) అన్నది పరమేశ్వరిని దెలుపును. "స్థితి–గతి" – స్థితి శివుడు, గతి పరమేశ్వరి, బిందువు స్థితి సూచకము. విసర్గము లేక త్రికోణము గతి సూచకము రెండు బిందువులు కదా విసర్గము. అందుచే ఆమె ముహుర్బిందురమ్య, అట్టి పరమేశ్వరి ఇందు అనవద్యముగా (లోపము లేకుండా) స్మరింపబడినది. శ్రీ పతి కుమారుడైన రామకృష్ణ కవి తాను కూర్చిన ఈ స్తుతిని ఈ పద్య సుమాంజలిని జగజ్జననీ చరణయుగమునందర్పించినాను అని చెప్పుకొన్నాడు. అనగా ఓయి పాఠకోత్తమా! ఇందలి ఏ పద్యమును నీవు గ్రహించినను, అది అంబికా శ్రీ చరణముల సువాసనలతో గుబాళించు చుండును. అని చెప్పినట్లాయెను. ఇది నిజమే! యథార్థమే! ఈ స్తుతిని హృదయమున నిలుపుము. అంబికా శ్రీ చరణ సుగంధములైన సుఖశాంతులు, ప్రసన్నత, ఆనందము ఆత్మాభిముఖ ప్రవృత్తి నీయందు వెల్లివిరియునని గ్రహింపుము.

జయ జయ శ్రీ చక్రాధీశ్వరి

శ్రీః